# స్వప్నము.



గ్రంథకర్త:

నందివాడ కామేశ్వరరావు, బి. ఏ.

కాకినాడ.




కాకినాడ.

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

1932.

హరిః ఓమ్.

# స్వప్నము.



## 1 వ రంగము.

(మదరాసులో తంబుచెట్టి వీధిలో ఒక రెండంతస్తుల మేడ- తంబుచెట్టి వీధే కాదు, ఏవీధిలో పెడితే ఆవీధిలో ఈ రంగమనుకొనవచ్చును. కాని మన ప్రధానపాత్రలు సమయమంతులవా రావీధిలోనే రెండంతస్తుల మేడమీద ఉండేవారు. పైఅంతస్తుమీా దోగది దానికి వీధిలోని కిటికీ ఉంది. ఇది చాలాముఖ్యము. గదిలో చిన్నమంచాలు మూడు

పక్కలు వేసి ఉన్నాయి. గోడమీద టిక్కు టిక్కుమని కొడుతూ పురాతనము వాచీ ఒకటుంది. ఎనిమిదిగంటలు కావస్తున్నా దావాచిలో. పక్కగదిలోంచి దాసీది వెంకి ఆరేళ్లకుర్రాడిని ఎత్తుకొని వస్తుంది. వాడు తిన్నగా ఉండక గింజుకుంటూటాడు. సమయమంతులవారి చిన్నబ్బాయి గోపి. మంచి పుష్టిగా సొగసుగా ఉంటాడు. కాని చాలా అల్లరిపిల్లాడు. దాసి వెంకి చిన్నది. పదారేళ్లుంటాయి. దాసీదైనా మంచి బట్టలే కట్టకొని ఉంటుంది. తనసరసు డెవ్వడో చెవులో యేదో హాస్యమాడుచున్నట్లు యెప్పుడు నవ్వుచుంటుంది.)

గోపి:—(వెనుగులాడుతు) అప్పిడే పడుకోమన్నావే ఎనిమిదైనా కాలేదు ?

(వెంకి యథాప్రకారము చిన్ననవ్వు నవ్వుకుంటూ బలవంతంగా గోపిని పడుకోపెడుతుంటుంది. ఊహూ పడుకోడు. గోపి కేకలువిని తల్లి వస్తుంది. ఆవిడపేరు ఆనందమయి. ఆవిడకోముప్పై వళ్లుంటాయి. పేరుకుతగ్గట్టే చాలా సర్దా మనిషి. మాట్లాడితే పిల్లలని కొట్టడము, తిట్టడములేదు. పిల్లలెంత అల్లరిచేస్తే అంతశాంత మావిడకు. ఇకను ఇల్లో అతిపరిశుభ్రింగా ఉండాలి. ఏచుట్టమో పక్కమో ఆయింటి

కొచ్చేడంటే ఆపరిశుభ్రత చూచి హాయిహాయి అనకుండా ఉండలేదు. తల్లి వెనకాలే పెద్దకొడుకు శేషు, కూతురు మీనా వస్తారు. శేషుకు పదేళ్లుంటాయి, మీన కెనిమిది. మీన చిన్నపిల్లయినా, ఊహ లెక్కువ. ఎప్పుడు ఏదో ఒకటాలోచిస్తూ ఉంటుంది. రెక్కలుంటే ఓమారింద్రలోకము అది చూచివచ్చి ఉందునుకదా అనుకొంటుంది. ఆపిల్లకి మొగాళ్లంటే ఒకవిధమైన అసూయ, ద్వేషము కూడాను. ఆడదానినైతే నేమి నేనుమాత్రము తక్కినవాళ్లలాగ మొగాళ్లకి అణిగి మణిగి దాసీదానిలాగుండ నన్నట్లు, స్వభావము కనిపిస్తూ ఉంటుంది.

పిల్ల చామనచాయ అయినా చురుకుగా ఉండడముచేత, అందంగా కనిపిస్తుంది. ఈపిల్లతో రెండుమాటలాడుదామా అని పైవాళ్ల కనిపిస్తుంది. మోకాళ్లు దిగేదిగనిపరికిణీ కట్టుకొంది. మెడలో నాజుకుగా ఓబంగారపు గొలుసుంది. ఈవిడ మన కథానాయకురాలు అవడంచేత ఇంతదూరంచెప్పవలసివచ్చింది. శేషు, మీనా వాళ్లవాళ్ల మంచాలమీద పడుకొంటారు. తల్లి మీనపక్కమీద కూర్చొని పిల్లలఅల్లరి మాటలు వింటూ నవ్వుచుంటుంది. మధ్యమధ్య వాళ్లకి సమాధానము చెపుతుంటుంది.)

శేషు:—(ఎవ్వరు చూడకుండ తాను కనిపెట్టినట్లు) అమ్మా! మేమో ఆటాడుకుంటాము. నేను నాన్ననట, మీన అమ్మట- ఏం? (తనతండ్రిలాగు పెద్దగొంతుకతో) ఏమిటా అల్లరి!

మీన—(ఇంకేదో ఆలోచిస్తు) మనకో పిల్లుట్టిందట!

శేషు—(సర్దాగా) అవును. ఏమేవ్! శుభమైనవార్త. (అసలు తల్లికే సంతానము కలిగినట్లులు తెలియనట్లు) నువ్వోపిల్లతల్లివైనావు. (మీన ఎంతోసంతోషిస్తుంది). అసలు సంగతి మర్చిపోయేవు. పిల్లా పిల్లాడా అని అడగవు?

మీాన—ఎవ్వరైతేనేమి ? ఎవ్వరో ఒకరు కలిగేరు అంతేచాలు.

శేషు—(చిన్నబుచ్చినట్లుగా) ఆడాళ్లకి మొగాళ్లకి బేధమిదే! నువ్వను.

మీాన—ఏమండీ! ఏంచేస్తున్నారు ? మీారు సంతానవంతులైనారు.

ఆనంద—(పొరుగింటావిడ సుందరమ్మ మొగుడుతో మాటలాడడము విందికాబోలు, ఈమెుండని తనలో తానును వ్వుకొంటుంటుంది)

శేషు—పిల్లా పిల్లాడా ?

మీూన—పిల్ల.

శేషు—(లేక లేక ఏదో ముసలికాలములో సంతానము కలిగితే అది ఆడపిల్ల అయిందే, తనలక్షరూపాయిలాస్తి ఏవారసులకో పోతున్నాదే అన్నట్లు) ఊ ! ఊ !

మీూన—ఏమండీ అలాఉన్నారు ?

శేషు—మళ్లీ అను.

మీూన—ఏమండీ మళ్లీ మీూరు సంతానవంతులైనారు.

శేషు — (అన్నా ఏమిజబాబువస్తుందిరా బాబు అన్నట్లు) పిల్లా పిల్లాడా ?

మీన—పిల్లాడు.

శేషు—(కన్నులు కలిగిన భాగ్యమన్నట్లు) ఏడీ!ఏడీ!

గోపి—(పక్కమీదనుంచి లేచిపోతూ) అన్నా నేనూ ఆడతానురా ?

శేషు—మూకు మరెవ్వరు అక్కర్లేదు.

గోపి—(చిన్నబోతు) అయితే నేను మీకొడుకునై పుట్టేవద్దురా ?

శేషు—మాకిద్దరు పుట్టేరప్పుడే- చాలు.

గోపి —(ఏడుపు మొగము పెట్టుకొంటూ) నేనెవ్వరికీ అక్కర్లేదు ?

ఆనందమయి—ఎవ్వరికీ అక్కర్లేకపోవడమేమిటోయి నాయనా, నాకు కావాలి.

గోపి—(సంతోషంగా) పిల్లా పిల్లాడా ?

ఆనం—(ఎంతో ఆనందంగా) పిల్లాడు.

(గోపికి విజయము కలుగుతుంది. శేషు కపజయము. ఇంతలోకి వాళ్ల నాన్న వెంకటశివుడొస్తాడు. దురదృష్టవశా

త్తు అతను పిల్లలఆనందముచూచి సంతోషించడానికి తగిన స్థితిలో లేడు. అతను నిజంగా మంచివాడే. సర్దా అయిన మనిషి స్వతాగా- కాని కచ్చేరిలో ప్రతివాడిచేత తప్పున్న లేకపోయిన చివాట్లుతింటూ, తన్ను కుర్చీకి మేకువేసి కొట్టేసినట్లు కదలకుండా కూర్చొని, కాగితాలు కళ్లుకనబడేవరకు రాసిరాసి, ఆరైనా, ఏడైనా పైఅధికారి లేవకపోతే తన్ను, తన్నుపుట్టించిన వాడిని తిట్టుకొంటూ ఇంటికే తొమ్మిదిగంటలకు రావడమము. అలాంటివా డేలాఉంటాడు? అతని కేఅయ్యవారికనో దొరికి ఉంటే బాగుండిపోవును. కాని యీ

కచ్చేరీలో ఇన్ని పహగాపులుంటుంటే అదేలాగు- ఇటువంటి వెంకటశివుడుగారిని రంగములోకి తీసుకొచ్చేమని నాకూ విచారంగా ఉంది.)

వెంకట—(పిల్ల ముకోసము ఈపట్నము వీధువీధులు వెదకినట్లు ఆఖరకు ఈవిడగారు ఒంటింట్లోనా ఉండన్నట్లు) ఏమేవ్ ! ఇక్కడా ఉన్నావు ?

ఆనం—(ఈయనగారు కచ్చేరీలో ఏదో బహుమానము పుచ్చుకొన్నారు కాబోలు, ఏదో ఉపదేశము ముందనుకొని) ఏమండీ ఏం సంగతి ?

వెంకట—(కచ్చేరిలో పై అధికారి ఏదో తన్నడిగిన టులు, తాను మరిచిపోయి జ్ఞాపకము తెచ్చుకొనుచున్నట్లు,) ఏంసంగతి! ఏంసంగతి! కాళ్లు కడుకొండికి కొంచెము నీళ్లిస్తావు?

మీనా—(అన్నింటికి తానే పెద్దలాగు) ఉండు నాన్నా నేను తెచ్చియిస్తా. (అని పక్క మీదనుంచి చంగున గెంతుతుంది)

వెంకట—(కచ్చేరిలో ప్రతీ అనామధేయుడు దమ్మాడీ చెయ్యనివాడు తనపై కోపగించుకొంటే, నేను వీళ్లమీద కేకలు వెయ్యలేనా అన్నట్లు)- తంతాను, పమకో.

ఆనం——(అతివినయవిధేయలతో- భర్త కచ్చేరిలోప డిన తాపమును పోగొట్టునట్లు చల్లని మాటలతో) ఇదిగో నండి ఇస్తాను. చలని చెంబుతో వేడినీళ్లుపెట్టేను. ఇదిగోపిల్ల ని పడుకోబెట్టి——

గోపి——(ఏదోపని ఉన్నట్లు) అమ్మా! నేనెప్పుడు పుట్టనే?

ఆనంద——రాత్రిపదిగంటలకు.

గోపి——పదిగంటలకా? నేను పుట్టినప్పుడు నీకు మెలుకవరాలేదుకదా?

ఆనంద——(నవ్వుచు)- రావేదోయి,

వెంకట——(ఏమిటో ఇల్లంతా కూలిపడిపోతుంటే తన పెళ్ళాము సలహా పుచ్చుకొనుచున్నట్లు)- ఏమేవ్ ! నన్నీ యింటిలో ఉండమన్నావా ? పొమ్మన్నావా ?

ఆనంద——(గ్రహించి) నాయనా పడకొండోయి, మీ నాన్నగారికి కోపమువస్తున్నాది చూచేరా ! కేకలెయ్యకండి ! (అప్పుడు వెంకి ముందుకీగా పట్టుకొని వస్తుంది)- ఏమిటేఅది, ఆం గోషి, దొంగ, మందు తాగకుండాపడుకొంటున్నావా ?

గోపి—(వెంటనే) నేనుతాగను.

ఆనంద— (నెమ్మదిగా) ఇదిగో నీకేమిస్తానోచూడు మందుతాగేవంటే- (అని పక్కగదిలోనికి వెళ్తుంది)

వెంకట—ఓసీ ! వాళ్లనిముద్దుచేసి పాడుచేస్తున్నావు. (తనచిన్నతనం జ్ఞాపకము తెచ్చుకొంటూ) గోపీనేను నీ అంతప్పుడు మందు గుటగుట తాగేసి వాడిని.

మీన—(తనతండ్రేగదా ఇంతధైర్యశాలని అతనిని చూస్తూ) నువ్విప్పుడు తాగుతున్నమందు మరీచేదుకదూ నాన్నా ?

వెంకట—(మంచిమాటే అంది మీన, ఈతరుణము పోకూడదను కొంటూ)- చేదా చేదున్నరా? ఆమందుసీసా ఎక్కడాకనబడకుండా ఉంది కాని లేకపోతేనా ఒక్కగుటకలో తాగేసి ఉందును.

మీన—(పరోపకారమే తనవ్రతములాగు) నాకు తెలుసు నాన్నా ఎక్కడుందో- తీసుకొస్తాఉండు- (తండ్రి ఆ పేలోగా పక్కగదిలోకి వెళ్లి అతనిమందుసీసా తీసుకొస్తుంది.) ఇదిగో నాన్నా.

వెంకట—(వెక్కిరింపుగా) ఆc. దొరికిందా ?

మీనా—(మందో గ్లాసులో పోసి యిస్తూ) చూడు గోపీ! నాన్నేలా తాగేస్తాడో!

వెంకట—మొదట గోపి తాగితే

గోపి—(తండ్రిమాటలు నమ్మకూడదు, దగుల్ బాజీ అన్నట్లు)—నాన్న మొదట తాగితే—

వెంకట—తాగకపోతేమానీ. నాకేం. నువ్వేదగ్గుతుంటావు!

మీనా—(తండ్రి తాననుకొన్నంత ధైర్యశాలి కాడా అని అనుమానిస్తు) గుటగుట తాగేసేవాడ నన్నావు?

వెంకట—గోపితాగితే.

గోపి—నువ్వుతాగితే.

మీాన—(మధ్యవర్తిగా) పోసి ఇద్దరు ఒక్కమాారే తాగండి.

(ఓ అలాగే అని గోపి వాళ్ళనాన్న యిద్దరు ముందు గ్లాసులు నోటిదగ్గఱ పెట్టుకొంటారు. గోపి తాగేస్తాడు. వెంకటశివుడు తాగకుండా గ్లాసు క్రింద పెట్టేస్తాడు)

శేషు—నాన్న తాగలేదు (గోపి యింతమోసము జరిగిందికదా అని మనోవ్యధతో ఏడుస్తుంటాడు.)

వెంకట—ఏమిటిరా గోపి ఆయేడుపు? నోరుముయ్యి. (ఆనందమయి బిస్కత్తుపట్టుకొని వస్తుంది.)

గోపి—అమ్మా! నాన్న మందు తాగుతానని తాగలేదే! (అని చిన్నమొగము పెట్టుకొంటాడు.)

ఆనం—పడుకోండి నాన్నా! చాలా రాత్రి అయింది. (అని వాళ్ళకి దుప్పట్లు కప్పి సర్దుకుంటుంది.)

గోపి—అమ్మా! నువ్వు నాదగ్గఱపడుకోవే? నాకు భయము వేస్తుంది.

ఆనం—భయములేదోయి నాచిన్నినాన్నలు! (అని ముద్దుపెట్టుకొని, దుప్పటి సర్దుతుంది) వెంకడుంటుందిగా. భోం

చేసి యిప్పుడేవస్తా, పడుకోనాన్నా. (ఆనందమయి భర్తతో ప్రక్కగదిలోకి వెళ్ళిపోతుంది. ఆపడకగదిలోనిదీపము కొంచెము తగ్గించేసి ఉంటుంది. ఏదో అద్భుతము జరగబోతున్నట్లు దీపము బెదురుచుంటుంది. పెంకి మూలకూర్చొని కునికిపాట్లు పడుచుంటుంది. ఇంతటిలోకే సింహకిటికీలోంచి ఒక చిన్నకుర్రాడు, పదేళ్లుంటాయి, ప్రవేశిస్తాడు. రంగురంగుల లాగు తొడుకొన్నాడు. వానివేష ప్రతాపు అతను వచ్చినప్పుడైనచప్పుడికి మీనా మేల్కొంటుంది ప్రతాపు మీనను చూచి నవ్వుతాడు. మీనకూడ ఏదోచిరకాలపరిచితుడు కనబడ్డటులు తల ఊచుతుంది.)

మీన—నీ పేరేమిటి?

ప్రతా—ప్రతాప్!

మీన—మీ యిల్లెక్కడ?

ప్రతా—మేఘాలమీద.

మీన—మేఘాలలా పరిగెత్తుతాయిగదా మీరు పడిపోరు? మీద దేవలోకమా?

ప్రతా—అవును.

మీన—(ఆలోచిస్తు) మీకుత్తరాలెలా వస్తాయి ?

ప్రతా—మాకుత్తరాలురావు.

మీనా—మీ అమ్మకి ?

ప్రతా—మాకు అమ్మ లేదు.

మీనా—(తనకే కదా అమ్మ ఉందని గర్వము. ఈ దేవలోకము వారి శృంగభంగము చేదామని.) మా అమ్మ నాన్న ఉన్నాడు. (ప్రతాపు విచారమొగము పెడతాడు.) ప్రతాప్! ఏడుస్తున్నావా? ఈలా రా. నాపక్క మీదకూర్చో. (అని వాళ్ళమ్మని వాళ్ళ నాన్న ముద్దుపెట్టుకోవడము అది జ్ఞాపకము వచ్చి ప్రతాపుని ముద్దుపెట్టుకోబోతుంది ప్రతాపు కొంచెము తొలగిపోతాడు.) అయితే నువ్వెందు కిక్కడి కొచ్చేవు?

ప్రతా—మీకు మీఅమ్మ కథలు చెప్పుతుంటిందిగా? అవి వినడానికి- మా కెవ్వరికీ కథలు రావు.

మీన—ఆఁ.

ప్రతా—అవును.

మీన—ఏకథ చెప్పమన్నావు?

ప్రతా—ఈగ ఇల్లలకుతూ పేరు మర్చిపోయింది అది.

మీన-ఓహో అదా ? ఆఖరికిదాని పేరు తెలుస్తుంది.

ప్రతా—పోనీలే పాపము. ఎంతె తమంది దగ్గరకో వెళ్ళింది. (అని పోబోతాడు)

మీన—ఎక్కడికి వెళ్లుతున్నావు.

ప్రతా—తక్కిన కుర్రాళ్ళకి చెప్పాలి.

మీన—ఉండు. ఎన్నోకథ లొచ్చునాకు. అవి మీ వాళ్లు విన్నారంటే—

ప్రతా—అయితే రా నాతో-మన మెగిరిపోదాము.

మీన—ఎగిరా? ను వ్వెగరగలవా?

ప్రతా—ఊఁ. నీ కెగరడం నేర్పుతా. చక్కా ఎగిరి పోదాం.

మీన—(సంతోషిస్తూ) శేషూ, గోపూ?

ప్రతా—వాళ్ళున్నూ.

మీన—(శేషూ, గోపులను లేపుతుంది) ఒరే, ఇది గోనురా ఒక అద్భుతం మన కెగరడం నేర్పుతాడట.

శేషు—ఏమోయి నువ్వు నిజంగా ఎగరగలవోయి ?

ప్రతా ఇదిగో చూడు (అని మీద కెగిరి చూపిస్తాడు. పిల్లలందరు అద్భుతమైన గారిడీ చూచినట్లు సంతోషించి కేక లేస్తారు ప్రతాపు క్రిందికి దిగుతాడు )

శేషు—నువ్వేలా ఎగిరేవోయి?

ప్రితా— ఇదిగో ఈ విభూతింత రాసుకోండి పాదాల కని కొంచెము భస్మమిస్తాడు. వాళ్ళది రాసుకొని మీద కెరుగుతారు. ఇంటికష్టం పడేలమని తగులుతుంది )

మీనా—(బుర్రి తడుముకొంటు) ఏం దెబ్బ తగిలింది.

ప్రితా—రండి కిటికీలోంచి పైకెగిరిపోదాము. (వాళ్ళందరు కిటికీలోంచి ఎగిరిపోయి ఆకాశమార్గాని పోతారు.)



# 2 వ రం గ ము.

## దేవలోకము.

(దేవలోకములో చిన్న తాటాకిల్లు. అది బాటకిదూరంగా లోపలికుంది. దానికి వెళ్ళడానికి చిన్నదారుంది. ఆదారికి ఇవతలా అవతలా క్రోటనుమొక్కలు- వాటిపక్కనే సంకిసమొక్కలు, వాటిపక్కని సీమతోటకూర, ఎంతో రమ్యంగా ఉంది. లోపల, సన్నజాజి విరజాజి, రాధామనోహరము, మాలతి, మొదలైనలతలు, చిన్నచిన్నపందెరలువేసి

పాకించిఉన్నాయి. వాటికినడుమను, మల్లెలు, చామంతులు, క్రిష్ణతామరమొక్కలు చిన్నచిన్న నుళ్లుకట్టి నాటిఉన్నాయి. ఇదంతా కంటికి ఎంతో నేత్రపర్వంగా ఉంది. దారిపోయే ప్రతివాడు, ఇ దెవ్వరి దీయిల్లు—ఎదో పెద్దభవనములాగు-ఎంత బాగుందని ఒక మారానందించిపోయేవాడు. ఆఉద్యానవనములో నలుగురు చిన్నపిల్లలాడుకొంటున్నారు. ఒకడు జామిచెట్టెక్కి కాయలుకోసి క్రింద పడేస్తుంటే తక్కినవాళ్లు పెనుగులాడుకొంటూ తింటుంటారు. మీాన వాళ్ళని తీసుకొని ప్రతాపు తిన్నగా అక్కడికి వస్తాడు.)

పఠితా—ఓ రే, ఒ రే మనకో అమ్మను తెచ్చేను.

పిల్లలు—ఏదీ ఏదీ! (అని మీానచుట్టుమూాగి ఏంతవ స్తువులాగు చూాచి ఆనందిస్తారు ) నువ్వు మాాఅమ్మవా ?

మీాన—(ఇదేమిటిరా, నేను కోరింది యింతత్వరలో సంప్రాప్తమయిం దనుకొని, పోసిలే యిదీమంచిదే, కాని వీళ్ళప్రార్థన వెంటనే అంగీకరిస్తే చులకనైపోతుంది వ్యవహార మనుకొని) నాకు తేలీదు, ఏం చెయ్యాలో !

పిల్ల—తెలియకపోతేనేం. మ కమ్మ కావాలి (అదో పెద్దకారణం లాగు.)

మీనా—(ఇక నింకా బెట్టుసరి చేస్తే పోనీ మాకక్కర్లే దులే అంటారేమో కొంపదీసి అని తొందరగా) సరేలెండి, (తనఅధికారమంతా ఒకసారు చెలాయిద్దామని) ఒర్రే! ఆ జామిచెట్టెక్కినవాడెవ్వరు ?

పిల్లలు—సూర్యం.

మీన—సూర్యం, ఇలారా, నిన్నేమిచేస్తానోచూడు (అని కళ్ళెర్రచేస్తుంది. పిల్లలందరు నవ్వుతారు. ఆనవ్వుచూచి మరీమండిపడుతుంది, తన అధికారము చులకనచేస్తున్నారని) ఎందుకానవ్వు ? పదండి లోపలికి. (సూర్యం గజగజవణికిపో

తు చెట్టు దిగుతాడు. పిల్లలని తీసుకొని మీాన, యింటిలోకి వెళ్లుతుంది) ఉండండి మీాకన్నాలు పెట్టి నిద్రపుస్తే నేగాని నా కేపనీకాదు కూర్చొండి పీటమీాద (అని వట్టినేల చూపిస్తుంది ఆపిల్లలందరు వొత్తొత్తి భోజనాలకి అలవాటుపడ్డవాళ్లే, అంచేత వాళ్ళు వరసవరసగా కూర్చొని తల్లి యే నవకాయపిండివంటలు వడ్డిస్తుందో అని చూస్తుంటారు.) కంచా లెట్టుకొన్నారా ?

పిల్లల—ఇదిగో (అని వట్టినేల చూపిస్తారు.)

శేషు—మీానా! నువ్వు మాఅమ్మవా ఏమిటే ?

రంగ—(పిల్లల్లో చిన్నవాడు. మూడేళ్ళుంటాయి కాని మాటల కేమున్నై పెల్లవాడైనా చాలడు.) అమ్మా! నూ చేవళే గోపి నాకూరంతా తీసుకొన్నాడు ?

సూర్యం—(ఆజట్టులోకంతా పెంకివాడు కయ్యానికి కాలుతవ్వుతాడు.) వెక్కిరిస్తున్నావేషూ ? తంతా.

మీన—(తనతల్లిని జ్ఞాపకము తెచ్చుకొంటు) ఓరే అబ్బాయిలు! అల్లరిచెయ్యకండి, నాన్నగారేవో కచ్చేరీ కాగితాలు రాసుకొంటున్నారు. అల్లరి చెయ్యకండమ్మ. రంగా! ఏమిటా దిక్కులుచూస్తం. అన్నయచూడు ఏలాంటి

నేస్తున్నాడో. ఉండు కలిపిపెడతా (అని వత్తొత్తికంచెములో వత్తొత్తి బువ్వకలిపి పెడుతుంది.) ఈకాస్త తినీ అమ్మా! ఎలాఉంటావు? (అని వాళ్ళభోజనాలైన తర్వాత పక్కవేసి పడకోపెడతుంది.) అందరు, కళ్ళు మూసుకొని పడుకొండి. నేనో కథచెబుతాను.

పిల్లలు—అవునే అమ్మా! ఏం కథ చెబుతావు?

మీనా—(ఈదేశ మిన్ని చిక్కులలో పడిపోయింది, ఓమతస్తుడని చూస్తే ఓమతస్తుడికి పడదు, బద్ధవైరము- దీనిని ఉద్ధరించే సాధన మేమైనా ఉందా లేకపోతే యింతేనా అని ఆలోచించినట్లు) ఏం కథచెప్పను?

సూర్యం—ఏం కథ ?

గోపి—ఏడుచేపలు కథచెప్పే అక్కా (వేళుకొరుక్కుంటు) అమ్మా !

మీనా—అలాగే, కళ్ళుమూసుకొని ఊఁ కొట్టండి. అనగనగా ఓఊళ్ళో ఓరాజుండేవాడు.

రంగ—ఏరాజు ? పేరు లేదు ?

మీనా—(అన్నా నీ డెక్కడసాధ్యండు. పరీక్షచేస్తున్నాడే ఏమిటి—అయినా ఏడి కెక్కడ లొంగుతానని) కపోతరాజు.

రంగ—ఈగ్గథచెప్పవు ?

మీనా—మనిషా కథ చెప్పుమంటే ఏలాగు. ఏకథా చెప్పను. పడుకొండి. మేము భోంచెయ్యొద్దా? (అని తల్లిగొంతుకలాగు గొంతుకపెట్టుకొని అతిమాధుర్యంగా) ఏమండి లేస్తారా ఏమిటి రెండుఝాములరాత్రియింది

పరితా—(ఇదేమిటిరా నన్నిలా మన్నిస్తున్నా దనుకొని) తమా షాకదు ?

మీనా—(ఎన్నాళ్ళకో పెళ్లైంది; యిప్పుడితను ఇలా అంటున్నాడనుకొని) మీకిష్టము లేదా?

పరితా—ఇష్టము లేదు. నువ్వు మా అమ్మవి.

మీన—(పిడుగురిగి నెత్తిమీద పడ్డట్లు) పోనియ్యి, ఇష్టము లేకపోతే.

సవితా—నీకు కోపమూ ?

మీన—మీకు నామీద ప్రేముండేనా? మా నాన్నకి మాఅమ్మమీద ఎంతో ప్రేమ!

గోపి—(నాన్న, అమ్మ అనే సరికి జ్ఞాపకమువచ్చి) వెళ్ళిపోదామే మీనా మనింటికి.

మీన—అన్నను, మన్మోహిని దగ్గరికి (అని ఎంత అణిగిమణిగి పతిఆజ్ఞలో మెలగినా, కావలసినప్పుడు వాడినే నవ్వు

ఖరీలాగు ఉపయోగించుకోగల శక్తి నాలోనుం దన్నట్లు, తీవ్రింగా) వెంటనే మాప్రియాణము.

పిల్లలు—మమ్మలిని వదలి వెళ్ళిపోతా ?

మీాన—మళ్లీ వస్తాకా ! అల్లరిచెయ్యకండి. భయము లేదు లెండి. వెంకి సాయము పడుకుంటుంది. (వెళ్ళాములాగున) ఏమండి మరిచిపోకండి మీామందు తాగడం. జబ్బుము దిరిపోతుంది.

ప్రితా—(ఇదేమిటిరా ఇది నన్నింకా యిలామన్నిస్తుందని) మరిచిపోన్నులే.

## 3 వ రం గ ము.

(మొదటిరంగములోని గది. తెల్లవారుచున్నది. కిటికీ లోనుంచి వెలుతురొస్తుంటుంది. ఆనందమయి చప్పుడు చెయ్యకుండా వచ్చి పడుకొన్న ముగ్గురుపిల్లలను జూచి మూడుల క్షల రూపాయిలులాగు మురుస్తు, సంతోషంగా తనలో తాను నవ్వుకొంటు, కులాసాగా కూనిరాగము తీసుకొంటు, అద్ద మెదుట నిల్చుండి బొట్టుపెట్టుకొంటుంది.)

మీనా—(నిదరలో) ప్రతాప్, మళ్ళీరావాలిసుమా?

ఆనం—ఏమిటే మీనా? ఎప్పుడు ప్రతాపేనా- బాగుండదే ఎవ్వరేనా వింటే నవ్వుతారే.

మీన—(కళ్ళునులుపుకొంటు లేస్తుంది) అమ్మా మేము దేవలోకము వెళ్లేమే.

ఆనం—ఛీ! ఊరుకో! ఏదోకలగన్నావు.

మీన—కలగాదే నిజమేనే, కావలిస్తే అన్నినడుగు, గోపినడుగు. అక్కడేం, మంచిమంచిపువ్వులు అంటున్నాయే.

ఆనం—(ఇదేమిటిరా ఈనిక్షేపంలాంటి కూతురుమీద ఏదైనా పీడ వాలిందా ఏమిటని దిగులు పడుతుంది) ఏమీ

లేదు ఇలాచూడు (అని మొగముమీద కొంచెము నీళ్లుజల్లు
తుంది.) మెలుకవ వచ్చిందా ?

మీనా—(తల్లికేమిటిరా తెలియకుండా ఉంది, ఎలాచె
పితే బోధపడుతుందని) నిజమేనే ! ప్రతాపు, సూర్యంవాళ్లు
ఎంతో బాగున్నారు. ఎంతో చక్కని బట్టలు కట్టుకొన్నారు.
నేను, అన్నా, గోపి నాలుగురోజులుండి వచ్చేము. వాళ్లింకా
ఉండమన్నారు కాని, నువ్వు మేము కనబడ లేదని ఏంబెంగ
పెట్టుకొంటావో అని వచ్చేసేం ! ఇప్పుడే వెళ్ళిపోయేడు
ప్రతాపు.

ఆనం—(దీనిమీద ఏదో భూతము వాలింది నిజమే అని కళ్ళవెంబడి నీళ్లుతెచ్చుకొంటుంది. ఇంతలోకి పొరిగింటి సుందరమ్మ తనకొడుకుని తీసుకొని వస్తుంది. కొడుకో ఎనిదేళ్లవాడు. చిన్నవాడైనా శోభనపు పెళ్ళికూతురంతసిగ్గు) ఇదేమిటిది వదెనా ? మా అమ్మాయిమీద పీడేదో వాలింది. ఎక్కడో దేవలోకము వెళ్ళిందట. నాలుగు రోజులక్కడుండి చక్కావచ్చిందట. నిన్నరాత్రి పడుకోపెట్టినప్పటి కేమీలేదు. (అని కన్నీరు జొట జొట కారుస్తుంది.)

సుంద—ఇదేమిటిది వదినా నీకేం మతిపోయిందా ఏమిటి? ఈమాత్రానికే. ఏదో కలగంది.

ఆనం—(గద్గదస్వరముతో) నాపెద్దకూతురు లీలాగే కలలుగని మాయమైపోయింది, వదినా!

సుంద—ఏమీ లేదు ఊరుకో వదినా! ఇంకో గడియకు మా అబ్బాయి, ఇది అందరు కలిసి ఆడుకొంటారు. ఏమి చేమీనా?

మీన—(మాటలాడకుండా వచ్చిన ఆ అబ్బాయి కేసి రెప్పవాల్పకుండా చూచిచూచి) ఏమోయి, ప్రతాప్, మ

మ్మలనితీసుకెళ్ళడానికి వచ్చేవా? (అని వాని దగ్గఱకెళ్ళి చెయ్యి పట్టుకొని తీసుకొచ్చి తనమంచముమీాదకూర్చోపెట్టు కొంటుంది )

సుంద—(నవ్వుచు) వదినా! చూచేవా, నీకూతురుచి న్నది చిన్నది అంటావు పెళ్ళిచెయ్యమంటే. అప్పిడే బావని మంచంమీాద కూర్చోపెట్టుకొని సరసాలాడుచున్నాది.

ఆనం—(చిన్నవవ్వునవ్వుకుంటు)ఎవ్వరే మీానా నిన్ను తీసుకువెళ్ళినది? ఈప్రతాపేనా ?

మీన—(ఈమాటకేమి వినిపించుకోకుండా ప్రతాపుతో) మందుతాగడం మరిచిపోలేదుకదా మీరు ?

ప్రతా—(ఇదేమిరా ఈమీన నన్నిలాఅడుగుతున్నాది. ఏమో దేముడికే ఎరుకనుకొని) ఏమ్మందు ?

మీన—ఆఁ. రాత్రి మీతో చెప్పి గూటిలో పెట్టివచ్చేనుకానండి ?

ఆనం—(చేతితో మీనమొగము తనవైపుతిప్పుతు) అమ్మా, వెర్రితల్లీ ! ఇంకాతెలివిరాలేదా? రాత్రి నువ్వెక్క

డున్నావు. ప్రతాపెక్కడున్నాడు. ప్రతాపు వాళ్ళింటిలో వాళ్ళమ్మదగ్గర పడుకొన్నాడు. మందేమిటి ? ఆమన్నింపేమిటి ?

సుంద—ఏమీ లేదు వదినా పద. ఏదో కలగంది. దానిని మరేమి ఇది చెయ్యరు. దానికే తెలివస్తుంది. వాళ్ళు వాళ్ళు ఆడుకొంటారు. పద (అని ఆయిద్దరు పెద్దవాళ్ళు వెళ్ళిపోతారు. మీన ప్రతాపుని అలా చూస్తుంటుంది. ప్రతాపు మీన చెయ్య ట్టుకుంటాడు. వాళ్లందరు మంచాలు దిగి ఆడుకొంటుంటారు.)

